శ్రీ లలితాయై నమః

Sri Dinakalpadruma Satakamu.

# శ్రీ దీనకల్పద్రుమ శతకము.

శ్రీమన్నిడ్వోలవిద్వదాస్థానకవి

బ్రహ్మశ్రీ గాదేపల్లి వీరరాఘవశాస్త్రికృతం

మార్కాపురం తాలూకా కొలుకుల కాపురస్థులు

శ్రీమాచర్ల కోటీశ్వరయ్య, శేషయ్య శ్రేష్ఠులు [illegible]



—

నరసరావుపేట

రాఘవరామానుజా ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపబడినది



1934.

రిజిష్టరు కాపీరైటు.] వెల 0-2-0

పణ్డితాభిప్రాయము.

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

యోగ్యతాపత్రిక.

శ్లో॥ అర్థాలఙ్కృతి చారుభావపటలీధారీణవినిర్యద్రసా।
సూక్ష్మార్థైస్సుగ్రథితసత్కవీశమనసాం వాచాఙ్కురం త్వామహమ్।
భో భో రాఘవసత్కవీన్ద్ర విలసద్విద్వాలలాక్షీసభా।
మధ్యేఽస్మిన్ త్రిలుఠద్విబ్బగేభహారిత్వం సఖీక్ష్యాధనోఽభవమ్॥

శ్లో॥ చఞ్చత్సద్గవిశాలతాసుమహతీభావప్రవాహాఞ్చితా
నానారూపసుకల్పనాప్రవిలసత్పుష్పావళీమణ్డితా।
శిక్షాదిస్వరసేన రాఘవకవిప్రాస్యాలవాలోద్గతా।
చానన్దాఖ్యమహాఫలాని దిశతాత్త్వద్వత్కవిభ్యస్తతా॥

శ్లో॥ ధన్యా రాజసభా భవత్సుకవితాకన్యాసమాలోకనా।
ధన్యాస్తత్కృతిసాహదాశ్చ విబుధాస్సన్తోషపూర్ణాన్తరాః
ధన్యస్త్వం త్వదనుగ్రహేణసహితో రాజ్ఞాహి సమ్భావిత।
స్తచ్ఛ్రీరాఘవసత్కవీశ్వర గదాం జీవేహ లోకే శతమ్॥

శ్లో॥ వినయనయదయార్ద్రో విశ్వసన్తోషదాంస్తాన్।
విబుధజనమహాశీర్వాద మాకాంక్షమాణః
హిమగిరితనుజాఙ్ఘ్రిద్వన్ద్వదివ్యప్రసాదా।
త్త్వయమతులబుద్ధిమ్ప్రాప్నుయాద్రాఘువర్యమ్॥

శ్లో॥ గోపాలపేటసంస్థాన । కవినా పత్రికా మయా।
లిఖితా రామచన్ద్రేణ । శ్రీమేధాయాదియజ్వనేః॥

శ్రీరస్తు

—శివమస్త్వాయోగాత్ :—

ఇతి కవయితా
తెల్కపల్లి రామచన్ద్రశాస్త్రీ,
అభినవకాలిదాసాదిబిరుదాఙ్కితః,
గోపాలపేటసంస్థానాన్తర్గత
రాజాపురగ్రామవాసీ
సహృదయకృపాభిలాషీ.

ఆఙ్గీరసనామసంవత్సర
ఫాల్గుణశుక్లసప్తమీ
భృగువాసరః

శ్రీ లలితాయై నమః

# దీనకల్పద్రుమ శతకము



ప్రారంభము.



రాజీవ భవాది సర్వసురసం ♦ సేవ్యుండవై సంచిత
ప్రారబ్ధాత్మక జీవకోటులకిలన్ ♦ బ్రత్యక్ష దైవంబవై
ఘోరాపత్పటలాంధకార రవివై ♦ గూర్చున్న నీపూజకై
ప్రారంభించితిభక్తి పూర్వముగ ♦ రామా! దీనకల్పద్రుమా! 1

మ॥ దయజూపన్ గలదాతవంటి మునునా ♦ తప్పెన్నరాదంటినా
శ్రేయమింకెక్కడగాననంటి ననుగన్ ♦ జాలించుకోనంటినా
పయి దాక్షిణ్యముజూపి కోరికల దీ ♦ ర్పన్ వేడుకొంటిన్ మరే
మఱవన్ బాదమువీడనంటినిను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 2

శా॥ తప్పుల్ జేసిన నన్ క్షమించవలె లేదా ♦ యొప్పులే జేసినన్
మెప్పున్ గాంచి యనుగ్రహించవలెనె ♦ విశ్వన్ పిడిమాకిట్టి పెన్
ముప్పుల్ గూర్చిన లాభమున్నదియె సం ♦ పూర్ణానురాగంబుతో
నప్పా! నాప్పునిబ్రోవగా మనసి ♦ రామా! దీనకల్పద్రుమా॥ 3

శా॥ చూడన్ జట్టము మ్రొక్కదైవ మచటన్ ♦ జూపట్టకున్నట్టియా
పాడున్ మానవజాతిలో దమదయా ♦ పారప్రభావంబునన్
గ్రీడానిర్జిత పాకశాసనులు మ ♦ న్నీలున్న వారన్నమా
రాడన్ జెల్లునె నీదయా దృతికి ♦ రామా! దీనకల్పద్రుమా॥ 4

మ॥ పదముల్ వీడగలేను యేఘనుల నేన్ ♦ బ్రార్థింపగాబోను దు
ర్మదమున్ జేరగ నేను నీహితుల దూ ♦ రన్ రాను యేమాత్రమా
పదలన్ సుక్కెడు వాడగా నెటులచే ♦ పట్టన్ గటాక్షించెదో
యదినీభారమునిర్వహింపవలె రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 5

శా॥ శ్రీ సీతామణి వామభాగమున నిన్ ♦ సేవింపఁత్వత్సేవనా
వ్యాసంబే సదమున్నెము లక్ష్మణుడు ♦ పార్శ్వంబందుఁగొల్వుండవి
శ్వాసంబొప్పగ మర్కటేశ్వరులు కన్ ♦ సన్నన్ మెలంగన్ సదా
మాసంరక్షణ సేయుగామనవి ♦ రామా! దీనకల్పద్రుమా! 6

మ॥ తనువున్ నొవ్వగ జేయుగాదగిన య ♦ త్నంబేమియున్ లేదు నీ
ధనువున్ దాల్చి రణంబునందు పని సం ♦ దర్శింపగా లేదు నీ
మనమున్ మందిరమున్ భక్తుడంచుఁ దలపన్ ♦ మాకొరకై కీడేరునో
మను వంశాంబుధిసన్యశీతకర రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 7

శా॥ తనువా! నీలపయోద సన్నిభము కాం ♦ తారత్నమా సుమిత్రికాం
తి నితాంతంబుగఁ దాల్చు కోర్కెమ్మరుఁగుసం ♦ దీపించుమా హృద్దయా
జనితానంద రసప్రవాహములు వ ♦ ర్షంబుల్ భవద్భక్తుల
ననతాపాగ్నుల నార్పగామనవి ♦ రామా! దీనకల్పద్రుమా॥ 8

మ॥ సరసన్ జేరిన శత్రు సోదరు సమీల ♦ సంరతిన్ గాపించిన
చరణంబే శరణంబుగా గొనయెనా ♦ స్వామీ మారి రక్షించియే
దరిలే కాశ్రయమిచ్చు వేడుకబరిన్ ♦ ధన్యాత్మగావించునీ
స్మరణంబే శరణంబు జీవులకు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 9

మ॥ నినుయజ్ఞార్థము వేడలేదు పగవా ♦ నిన్ దానన్నుఁ బ్రార్థింపఁత
ద నిమిత్తంబుగ జన్ముబాలకునకై ♦ యత్నింప లేదింతకున్
ముని శార్దూలుల కందరాని త్రిజగ ♦ న్మోహప్రదంబైన నీ
మనవం బెప్పుడు గూర్పగామనవిరా ♦ మా! దీనకల్పద్రుమా 10

మ॥ వనధిన్ గట్టెడు వేళభక్తమెయి సే ♦ వల్ జేయగా నెంచి పా
వన తీర్థంబుల మున్గి యాయిసుకలో ♦ పల్మారు పొర్లాడి తె -
చ్చిన మృత్తున్ గనిసంతసించి యుడుతన్ ♦ జేపట్టి రక్షించు నీ
యనుకంపాతిశయంబు నెంచెదను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 11

మ॥ దుష్టిహీనాసాది తదుర్వరోదయన ♦ రాదుల్ రావణాదుల్ మహా
గ్రహులై జుట్టిన సంచలింపక ధను ♦ ర్దండ ప్రకాండంబులన్
స్పృహణీయుల్ గ ఘటించి మేటివగుచున్ ♦ సీతాసతిన్ గొన్న నీ
మహిమం బెంతనిసన్నుతించెదను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 12

మ॥ అరవిందాసన వాసవాద్యమరలో ♦ కాగ్రేసరోద్యచ్ఛిరో
పరివిభ్రాజదసూనరత్నకిరణ ♦ ప్రాచుర్యమైనట్టినీ
చరణం బే శరణంబుగాగొనిన నన్ ♦ సాకంగ వెన్డియుదే
మరియుం కెవ్వరుమాకుతారకము రా ♦ మా! దీనకల్పద్రుమా॥13

శా॥ ముక్తుల్ సేవల సందడింపరిపులే ♦ మూలన్ జొరన్ రాని నీ
శక్తిస్థానము వీడి మూఢులకు నా ♦ స్థానంబునే చోటనా
సక్తిన్ దారకమై జనించితివి నీ ♦ చందంబు వీక్షింప సు
వ్యక్తంబైనదనాథ రక్షణము ♦ రామా! దీనకల్పద్రుమా॥ 14

శా॥ వైకుంఠంబును పాడుచేసి సురసే ♦ వ్యంబైన క్షీరాబ్ధివా
సాకాంక్షన్ మరలించి పావనము నీ ♦ శాంతఃప్రవేశంబుమై
పోకన్ జేయక రామమూర్తివగుచున్ ♦ సూర్యాన్వయంబందున
రాకల్ మాని జనించుటచ్చెరువు ♦ రామా దీనకల్పద్రుమా॥ 15

శా॥ సాకేతంబె భవన్ని కేతనముగా ♦ సౌమిత్రియే భ్రాతగా
నా కౌసల్యయెమాతగా, జనకక ♦ న్యారత్నమే నాతిగా।
వాకోఁజూచుచరిత్రిగాణము ♦ పరబ్రహ్మంబవీపంచునే।
నాకల్పంబు వచింతునెంతునినుఁ ♦ రామా! దీనకల్పద్రుమా॥ 16

మ॥ దయయేమారె, పరోపకారమనకాం ♦ తారంబులన్ దూరె వి
ద్యయనన్ వెల్వెలవారె, భక్తియనసా ♦ దారెన్ దురాచారముల్।
పయికేతేరె; కవిప్రభావమునసా ♦ పన్ జూడుమీ వైన వి।
స్మయమైదోచినదేమిమార్గమిక రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 17

శా॥ రాయన్నంతనె పాతకప్రతతి ఘోరం ♦ జారిపోవున్ మరిన్।
డాయన్ రానటు చేయగాదలచి ♦ దార్ఢ్యంబౌ కవాటంబునా।
మాయం జాలిన యీ మవర్ణ మనయం ♦ బున్ గూర్చి నీ నామమై।
మాయం దుండెడి పాపముల్ దలుచు ♦ రామా! దీనకల్పద్రుమా। 18

మ॥ కపిభక్తాగ్రణి, బోయమాని ♦ శిలయున్ కన్యావతంసంబు పా।
పపు భూమీశ వినాశి సాత్వికుడు గ ♦ ర్వాగ్రంధి యాకాంధిని।
ర్వపు పీఠిక నీదయామహిమ చే ♦ వాటిల్లెనీ నిత్య స।
త్యపటిష్ఠత్వము నెన్న గాదరమె రా ♦ మా దీనకల్పద్రుమా॥ 18

మ॥ నిను ప్రార్థించిన సేవకావళికిరా ♦ నేరావి కేకష్టముల్।
నినుసేవింపని దుర్జనావళికి పో ♦ నేపోవి కేదుర్వ్యథల్।
కరులారన్ గనుచుండియున్ ♦ పొరపడంగా నేల నీలీలలన్।
మన సారన్ దలపోయుదున్ మనుచు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 20

శా॥ కాలుం డెవ్వడు నీదుభక్తవితతిన్ ♦ కంపింపజేయున్ మహా
కాలుం డెవ్వడు నీదు కింకరుల దా ♦ కిన్ బాపు రేయుంచు వీ
మోప్రిలం నిల్చు పిశాచ శాఖ్యహనుమ ♦ న్మాఖ్యాల్ చిరంజీవులై
మా లోదైన్యము బాపబాలరౌరా ♦ రామా! దీనకల్పద్రుమా॥ 21

మ॥ పలుమారీవిధి ప్రార్థనల్ సలుపగా ♦ పాలింపరా వేమినా
పలుకుల్ వీనుల జేర్చవేమి జనులన్ ♦ పాలింపవా యేమి సా
గిలి మ్రొక్కన్ దయరాదిదేమి యిదియే ♦ కీర్తేమి భావత్కని
ర్మలకారుణ్యము జూపగామనవి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 22

శా॥ విశ్వామిత్రనుతపవిత్ర భావ, రణప్ర ♦ ద్వేషివిద్వేష దైత్యారా।
స్త్రీశాపాపహృతిప్రవీణదృషద ♦ న్యాభూమిపాలాగ్రణీ।
శశ్వత్కీర్తి విలాసినీధవళిత ♦ వ్యోమమండలా, దేవ; స।
ప్తాశ్వోద్యత్కులవార్ధిశీతకర ♦ రామా! దీనకల్పద్రుమా॥ 23

శా॥ పాలుఁగారు కపోలభాగములతో ♦ భాసిల్లు నెమ్మోముపై
వ్రేలాడఁగల చిన్నకూఁకటులతో ♦ విందైనకందోయితో
త్రైలోక్యస్తుత యజ్ఞరక్షణకుఁ గో ♦ దండంబుతో, తమ్మునితో
నాలోచింపక వెళ్ళుటక్షజము ♦ రామా! దీనకల్పద్రుమా॥ 24

శా॥ ఘోరాకారపు, దాటకిఁగని దయా ♦ కూపారభావంబుతో
నాకీమాత్రముగా దలంచితి వెయ ♦ న్నాయన్న, నక్షించరా
కారాదర్శననాదియింద్రియని వే ♦ గఁగూల్చు నీధైర్యము
య్యారే! వర్ణన సేయఁగాదరము ♦ రామా! దీనకల్పద్రుమా॥ 25

మ॥ తననాథుఁ డెగటోర్చితెవ మనగఁ ♦ తారామహాదేవిద
ర్శనమాత్రంబున నిన్ను వాచ్యము దూ ♦ రఁ సాత్వికంబూనిరెమొ
క్షణనిమేషంబున దత్వబోధమెరుగం ♦ గాజేసినీదాసిగా
మనుమార్గంబెరిగించినావుగద రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 26

శా॥ విశ్వామిత్రుఁడు నర్పుయాగమునకై ♦ విఘ్నంబుగావింపగా
విశ్వాతీతపరాక్రమంబుగొనుచుఁ ♦ వెంచేయు రాకాసులఁ
విశ్వాసంబెడలంగనీకడచి తా ♦ నొక్కీర్తిగన్నట్టిన
ప్రాశ్వప్రస్తవనీయకీర్తియుత రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 27

మ॥ హాతుడైనట్టిజటాయుమూర్తిగనితి ♦ ర్యగ్జాతితో నేమియుఁ
మతితో జూడక పారలౌకికక్రి ♦ యాంతస్తంత్రంబులు
న్నతిగావించిన నీచరిత్రమునువి ♦ న్నఁగన్న నీసన్నిధిఁ
మతభేదంబులు లేమి స్పష్టమగు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 28

మ॥ సయిదోడవును భార్యధర్మమునకై ♦ చాపాయుధోపేతుడై
భయదారణ్యములోన జేరినను ♦ సద్భావంబు నాహించుచుఁ
బయినఁబోయెడు పక్షులుఁ మృగములుఁ ♦ బ్రాణాలనేనియ్యతా
మయిసాయంబొనరించిరౌను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 29

మ॥ అతసీపుష్ప సమానదేహలతతో ♦ నాజానుబాహుద్వయో
ద్ధృతకోదండ శరప్రకాండములతో ♦ దివ్యోరువక్షంబుతో
శతపత్రంబులబోలు నేత్రములతో ♦ సౌమిత్రితో సీతతో
నతిలోకంబగుతో చెనీహరువు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 30

మ॥ తమనామంబుననున్న పెంపుమహిమ ♦ చిత్తమ్మునందుగుర్తింపగ్రం
దముగా వ్రాసిన బోయయే యొగిగదా ♦ దాశరథీయనీశుండెస
త్యముగుర్తించుట సంశయాస్పదమటుహా ♦ నిన్నుగుర్తింపగా
మముబోంట్లింతటివారలీధరణి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 31

మ॥ తమకోపాగ్నికి తానె సూటియగుయే ♦ దావేగగా లేనికా
కము సీతాపతి, కావుకావుమనుచు ♦ తక్కష్టంబుగుర్తించి కో
కమునెచ్చన్ హితవాచరించిన భవ ♦ ద్గాఢానురాగంబునున్
మమకారంబును తింపగాదరమె రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 32

మ॥ పాదరింటన్ బ్రియపత్ని గ్రేగలి ♦ తమ్ముంగురత్కాలోతస
మ్ముదపీలన్ బ్రియభూషణంబులనుసీ ♦ వారాలన్ విరాధాదిను
ర్మదరక్షోగణకంఠనాద మునగన్ మాద ♦ స్మితాననాప్పగా
నదెవేంచేసి ముదంబడంచితివిరా ♦ మా! దీనకల్పద్రుమా। 33

మ॥ అలసాకేతపురిన్ వసించిసమహా ♦ హ్లాదంబుగా కోసలో
ర్కలు చేకూర్చుటకష్టసాధ్యమనియు ♦ శ్రీవదక్రమున్ శ్యాంబునన్
గలయీకోల్కల భక్తశేఖరులనా ♦ కన్ జేరియున్నాడవే
యలఘుప్రాభవసత్కృపాభరణ రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 34

మ॥ ధన్యుంజేసితివానిపాదపటిన్ ♦ తాత్పర్యమున్ నమ్మి సౌ
జన్యం బిచ్చితివల్లబోయకనువా ♦ చాసూక్తినాలించి నే
నన్యస్త్రాఖిల సత్యకృత్యుడనునై ♦ సాధించితిన్ నిన్ను న
న్నన్యాయంబును సేయజూడకుము రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 35

మ॥ సవనసంరక్షణమేమిజేసితివో పా ♦ షాణంబునేనాతిగా
నవలీలన్ ఘటియించుటెంతనిజమో ♦ యాకాశమున్ బ్రోచునీ
వ్యవహారంబున నెంతసత్యమొ మఱిన్ ♦ బాలించినన్ నిక్కమం
చవనీచక్రమునమ్మ నీకథలు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 36

మ॥ అనుకోరానిపరాభవంబిడిసని ♦ త్యద్రోహితమ్మూడునో
యినవంశాంబుధిచంద్ర నీకగతిన ♦ న్నేలన్ గటాక్షింపవే
యనసాన్నిధ్యమొసంగిబ్రోవవకో ♦ నేనాజన్మభక్తుండన
న్ననుమానించెదవేమిన్యాయమిది రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 37

మ॥ వనధిన్ దాటి, నిశాటవర్గములగ ♦ ర్వంబూడ్చి లంకాపురిన్
దనవాలాగ్నులగాల్చి భూతనయసం ♦ తాపంబుబోకార్చుక్రో
తినిసృష్టించితివెంకమానవులనా ♦ ర్తిన్ బాపిరక్షించుటెం
తనికార్యంబటివానుగ్రహింపవలె రా ♦ మా! దీనకల్పద్రుమా 38

మ॥ పగతుండైన త్రిలోకకంటకుడుపు ♦ ర్భావంబునన్ లంకలో
మొగసాలన్ వనమందురక్కసులలో ♦ మున్నుంచత్వన్నామమున్
నిగమోపాస్తిసజీవముల్ సలిపివా ♦ నిన్ దున్మింపగాజేసియే
మగనాలెన్నిక కెక్కెనిసతియె రా ♦ మా! దీనకల్పద్రుమా। 39

శా॥ సీతాదేవి యొకర్తుశంకరుడుతా ♦ త్రీమంత్రిసీరత్నమున్
చేతఃప్రీతిగ నంజనీతనయుడున్ ♦ శ్రీరామనామామృత
స్వాతంత్ర్యంబును గాంచి ధ్యానపరులై ♦ చాటించుచున్నారుమా
కాంతారార్క భవన్మహామహిమ ♦ రామా! దీనకల్పద్రుమా॥ 41

శా॥ దాసుండొక్కడు మున్ను భద్రగిరిలో ♦ త్వన్నామపారాయణ
వ్యాసంగంబున గుళ్ళు గోపురములున్ ♦ గట్టించి భావత్కదీ
క్షాసేవామహిముల్ ఘటించికద మో ♦ క్షంబందె నీనామము
ధ్యాసంబైన నరుండు ముక్తుడగు ♦ రామా! దీనకల్పద్రుమా॥ 40

మ॥ అతివేలంబగు నీదయామహిమనే ♦ యర్జించి సాధించి స
ర్వతపశ్శాలులకున్ కిరీటమయి వి ♦ శ్వామిత్రుఁ డాబ్రహ్మనే
ప్రతిసృష్టింపఁగ నేర్చినాఁడనిన నీ ♦ భక్తిప్రభావంబులన్
మతిగుర్తింపఁగ నెట్టుసాధ్యమగు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 42

మ॥ అవిముక్తంబున పార్వతీశ్వరుఁడు ని ♦ త్యంబీభవన్నామమై
భవముక్తిం బెంచి జపించి తారకమయు ♦ బ్రహ్మోపదేశంబు మా
నవసంఘంబుల కెల్లజీవులకు సం ♦ ధానించుచున్నాఁడని
న్నవలోకించి జపించ నేమికొఱ రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 43

శా॥ శ్రీరామా యనుమూఁడువర్ణములతో ♦ సిద్ధించునీనామమే
ఘోరాఘంబులనైన ద్రుంచుటకునై ♦ కూర్పున్న దీనాలుకో
పేరేదయిన వచింపనున్నదయినన్ ♦ పోపోఁదలే కెల్లరిం
దౌరా! గాసిలుచుండు రెందులకో ♦ రామా! దీనకల్పద్రుమా॥ 44

మ॥ కలకాలంబున నాద్యవిద్యతమతో ♦ కన్నన్నవర్తించు నె
చ్చెల సర్గస్థితులున్ వినాశనముద ♦ త్స్నేహప్రభావంబులీ
చెలువంబింపు పరిత్యజించుటయు ని ♦ శ్శ్రేయాత్మవిజ్ఞానని
ర్మలమోక్షస్థితి జీవకోటులకు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 45

శా॥ శ్రీయోషిత్కమనీయవిగ్రహుఁడవై ♦ జేజేలలోప్రోద్ధనై
మాయామోహితసర్వభూతతతివై ♦ మంత్రార్థభూతుండవై
యాయోగీశ్వరగమ్యమానసుఁడవై ♦ యాపూర్ణచిద్రూపివై
మాయం దెప్పుడనుగ్రహింపవలె ♦ రామా! దీనకల్పద్రుమా॥ 46

మ॥ అరిషడ్వర్గమటన్న తస్కరులక్షా ♦ నామూల్యచౌర్యక్రియా
చరణాంబోతకు జీవభావమునని ♦ సాయంబుతో నేకదా
పరిపూర్ణత్వమువీడి ఖండమగుచున్ ♦ బైనేమియున్ లేఁ యే
మఱిపాట్లన్ గనుచుండె లోకతతి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 47

మ॥ తెగతెంపేమియులేనియీయార్తులక్రియన్ ♦ దీపించునీయార్తులె
న్నగరానట్టి విపత్ప్రవాహమున నా ♦ నాజీవులన్ నెట్టి పెన్
పగగావించుచునుండ, కేడవయయో ♦ పంజూడవా! చూడవా
అగుపట్టన్ బ్రియతెంపవెందులకొరా ♦ మా! దీనకల్పద్రుమా॥ 48

మ॥ సరయూతీరమయోధ్యసాధుహితశ ♦ శ్వత్సిద్ధమేనీకు మం
దిరమంచాశువభేద్యమార్యహితమెం ♦ దేబోనిసత్కల్పనా
చరణంబందిమహాకవీశ్వరులునిన్ ♦ స్థాపించిరాత్మీయప
ద్యరసౌచిత్యము నందదేస్థిరమురా ♦ మా! దీనకల్పద్రుమా॥ 49

ఉ॥ ఉదధుల్ నీరములెండబాసినసమ ♦ స్తోర్వీధర శ్రేణిచూ
ర్ణదశంగాంచిన మిన్నువంగినసభో ♦ రత్నంబునిర్వృత్నమై
యొదగన్ గ్రినగల్గుగాక దమని ♦ తోర్వీపాసకుల్ క్షీణమ
న్నదితామొందక వెల్గుచుందురిలరా ♦ మా! దీనకల్పద్రుమా॥ 50

మ॥ క్షితికిన్ గంధము, నీటికిన్ రసమున ♦ గ్నిజ్యోతికిన్ రూపమం
చితసంస్పర్శమహాబలునకున్ ♦ చేకూర్చియాకాశమం
దతియత్నంబునశబ్దశక్తినిడనీవ ♦ ద్దానితో నైక్యమై
మతికేమాత్రముగోచరింపవెటురా ♦ మా! దీనకల్పద్రుమా॥ 51

మ॥ పనిగామీకుపురోహితుండయినయా ♦ బ్రహ్మర్షిమూర్ధన్యుడా
వనజాతాసనవాసవాద్యమర సర్వ ♦ ప్రాభవాధారప
ద్వనజద్వందుడు జగజ్జనగణప్ర ♦ స్తూయమానుండునై
యనయంబున్న వసిష్ఠమౌనిగద రా ♦ మా! దీనకల్పద్రుమా॥52

శా॥ సత్తుల్ మూడునివాద్యభూతములు ♦ చర్చల్ సేయమిన్నున్ నభ
స్వత్తుల్ ద్వత్తులువీటికూడికయెనీ ♦ సత్యస్వరూపంబుయీ
వృత్తాంతంబెరుగంగలేకజడులై ♦ వేయాదుజన్మంబులు
న్మత్తప్రక్రియ నెత్తుచుండెదరు ♦ రామా! దీనకల్పద్రుమా॥ 53

మ॥ పదిశీర్షంబులతో దశాననునిజా ♦ వం జేసితీవన్న నే
మ్మదిలో నమ్మికగల్గ దిందిరియములు ♦ న్మాదించు నైదైదునుం
బదినీశక్తినిగూర్చి లోకవితతిన్ ♦ బాలించుచున్నాడవి
య్యది రామాయణతత్వమే మొకద రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 54

మ॥ పరిణామంబంచు నట్టి యీ జగమునీ ♦ వా; నీకు నీరీతిగా
పరిణామంబులు నున్నవా! యితరిసం ♦ బంధంబుగా నీజగ
త్పరిణామంబు ఘటించెనా! యనుభవ ♦ ద్వ్యక్తాత్మసందేహసం
హరణంబీవె ఘటింపగావలయురా ♦ మా! దీనకల్పద్రుమా॥ 55

శా॥ కర్మన్ జంతువు పుట్టుచచ్చుననిన ♦ కాంక్షించుచున్నార హా
నిర్మానుష్యపు వేళ నీవొకడవే నే ♦ నిల్చియున్నాడవే
కర్మన్ జేసితివేల పుట్టితివిని ♦ గాఢేమనన్ నాకునీ
మర్మంబేమని వెల్లడించెదవో ♦ రామా! దీనకల్పద్రుమా॥ 56

మ॥ అడిగెన్ సీతవనావలోకనమటం ♦ చానాడు కల్పించితీ
వడుగన్ జేయక నామె వేషగల దే ♦ మూరీతిగాకిపులన్
సుడిలో ముంచుచు దేల్చుచుండుటయె ♦ నిశ్శుద్ధాత్మనై జంబు మా
యడియానేటికి నీయధీనులము రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 57

మ॥ అలవాటుల్ దలకెక్కి మార్పుకొనలే ♦ కారాటమే గానిగా
నిలమాకేటికి కర్మ యెక్కుడిదిసీ ♦ సృష్టిప్రభావంబులో
దలజూపెన్ శమియించుసందెయికచి ♦ త్త్రిభ్రంశమార్గంబులన్
దలుకన్ దాల్చకు దూరజేయకుము రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 58

శా॥ లోకాతీతుడ వీవనైనపుడునీ ♦ లోకాత్మవెట్లైతివో
కాకుత్సాన్వయరత్నమాయనినభ ♦ క్తశ్రేణీసందేహముల్
సాకల్యంబుగ దీర్పదేశుడవై ♦ జంతూత్కరంబందునీ
వాకల్పంబు వసింపగావలసె ♦ రామా! దీనకల్పద్రుమా॥ 59

శా॥ విద్యావిద్యలకీవయాశ్రయుడవై ♦ వెల్గొందియేకాశ్రయం
బాద్యంతంబులబిన్నధర్మములని ♦ య్యఁగారణం బేమటన్
విద్యావాదులకున్ సదుత్తరములన్ ♦ వేనోళ్ళవాక్రుచ్చునీ
మాద్యద్విగ్రహమిందు, జేరవలె ♦ రామా! దీనకల్పద్రుమా॥ 60

మ॥ తొలఁగన్ నేరనివాడనూరుడిటసూ ♦ తుండాటనేవేళలన్
దలుపే లేనిశ్రుతిస్వరూపహయమైయ ♦ ద్దానిపైయున్నడున్
నిలుచోనేరనికర్మసాక్షిరథియై ♦ నీయాజ్ఞనాకాశని
ర్మలఘంటాపదమెక్కిచూచునటరా ♦ మా! దీనకల్పద్రుమా॥ 61

మ॥ మునులన్ గాచితివేదయామహిమనో ♦ మున్ మర్కటస్వామిర
మ్మనిగాపాడితివేకృపామతినో ♦ యాపంక్తికంఠానుజున్
గొనిరక్షించితివెట్టిప్రేమనో ♦ దయాకూపారతాదృగ్దయన్
మనసారన్ బరగింపునాపయినరా ♦ మా! దీనకల్పద్రుమా॥ 62

మ॥ ధనురారోపణపణంబిడినసీ ♦ తాదేవికైగాధినం
దనుడున్ దమ్ముఁడు సభ్యులక్కజపడన్ ♦ దచ్చాప మొక్కెత్తున్
గొనిసజ్యమ్మొనరింపగా విరుగుటన్ ♦ క్షోణీతనూజాతయ
ల్లనపాణిగ్రహణంబొనరించెనిను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 63

మ॥ తులసీపత్రమ? బిల్వపున్దళము?సం ♦ తోషంబుబ్రాపింపకో
మలమల్లీసుమమా; పయోరుహమసా ♦ మాన్యాక్షతశ్రేణులా
తలదాల్పంగనటంచుజూడకురసో ♦ త్తంసాచ్ఛవృత్తక్రియా
త్యలఘుప్రార్థన పద్యపుష్పశతమురా ♦ మా! దీనకల్పద్రుమా॥ 64

శా॥ కోరన్ రాజ్యము, వైభవంబడుగనన్ ♦ గోరాడనింకేమియున్
ధీరోదాత్తులునిర్వికారులుతపో ♦ దేదీప్యమానుల్ సదా
వీరారాధననీకొనర్చినటుని ♦ ర్విఘ్నంబుగాభక్తిపెం
పారన్ నిన్ భజియింపజేయుమిక ♦ రామా! దీనకల్పద్రుమా॥ 65

మ॥ అడుగన్ జిల్లర వేల్పులన్ దిసిసి ♦ వారియావృత్తా కామ్యములల్
పడువాడన్ నటులియ్యఁగావలదనీ ♦ పాదంబు నే నమ్మితిన్
జడిమన్ వాపి సమస్తయోగిజన ♦ మోక్షస్థానపున్ బాటలో
నడుగుంచన్ సమనుగ్రహింపవలెరా ♦ మా! దీనకల్పద్రుమా॥ 66

శా॥ ఊరూరన్ విపరీతధర్మములు పె ♦ ల్లోప్యపాస్తులై మీరెరయే
సారాచారులమానసాంబుజములన్ ♦ శాంతేశకోద్వృత్తులే
తేరన్ జొచ్చె మహాత్ములెందరిగిరో ♦ దిక్కేమి మాకీయప
స్మారంబే గతి చక్కబెట్టుదవు ♦ రామా! దీనకల్పద్రుమా॥ 67

మ॥ కరవైపోయె పరోపకారకృషి ప ♦ క్షాణింపరాదయ్యెవి
ద్వరదాక్షిణ్యము నైకమత్యమనగా ♦ వక్రోక్తియయ్యెన్ గడున్
విరసంబయ్యెను పూర్వశీలశుభవ ♦ ద్విఖ్యాతభక్తాళిని
స్మరలేకెట్టులు గొల్తునో తెలియ రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 68

మ॥ భగవంతుండవటంచు నిన్నెఱిగి సే ♦ వాయుక్తిమై చేతితో
సగమున్ దిన్న ఫలంబు నైకొనుమురు ♦ చ్యాబైనదీపుండసన్
తగదంచాడక మెచ్చియా శబరి ♦ ధన్యన్ జేయు నీ ప్రేమయెం
దగుపట్టన్ గలదయ్య లోకమున రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 69

శా॥ సౌమిత్రిన్ బ్రతికింప ద్రోణగిరికై ♦ సామీరియే తేరనీ
సామర్థ్యంబఖిలంబునాతఁ డిడన్ ♦ సర్వంకషప్రజ్ఞమై
శ్రీమద్ద్రోణగిరీంద్రమున్ బెరికి తె ♦ చ్చెంగాక శక్యంబె స
ర్వామోదంబుగ తా నదెచ్చుటకు ♦ రామా! దీనకల్పద్రుమా॥ 70

మ॥ ఖలుడన్, క్రూరుడ దుష్టుడన్ జడుడదు ♦ ర్గర్వాంధుడన్ కామవి
హ్వాలుడన్ నీచుడ పామరుండ శఠుడన్ ♦ పాపాత్ముడన్ మత్తుడన్
దలతున్ నీపదసారసంబు లెదలో ♦ ధన్యాత్మవే వేగని
ర్మలచేతస్కుని జేసి బ్రోవగదె రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 71

శా॥ నానారత్నవినూత్నకాంతివరమా ♦ న ప్రోజ్జ్వలత్సౌధసం
తానానంతవ నీవిచిత్రముల మో ♦ దంబిచ్చు లంకాపురిన్
దానంబిచ్చి విభీషణున్ దనుపునీ ♦ దాతృత్వమున్ జూడ మా
కానందంబిగురొత్తె చిత్తమున ♦ రామా! దీనకల్పద్రుమా॥ 72

మ॥ వనవాసంబున కీవు వెళ్ళుతరి నీ ♦ వామాంకమందున్న భూ
తనయారత్నము నెంతవద్దనిన పా ♦ ధర్మ్యంబుఁ బాటించి సూ
ర్యుని వెంటన్ జను ఛాయపోల్కి దమ ♦ తోనుండన్ గటాక్షించితే
మనవచ్చున్ దను సత్యవాగ్రచన రా ♦ మా దీనకల్పద్రుమా॥ 73

శా॥ లోకోపద్రవకారకుండవయి స్వ ♦ ర్లోకేశముఖ్యామరా
నీకంబున్ సుడివెట్టు రావణుబలా ♦ నీకంబు లెక్కింపకే
చేకొమ్మిచ్చితివో విభీషణయిదే ♦ సిద్ధించె లంకాపురీ
ప్రాకామ్యంబని యింతసాహసము ♦ రామా! దీనకల్పద్రుమా॥ 74

శా॥ పాదోద్భూతరజంబునొకశిల యే ♦ పద్మాక్షియయ్యెన్ గడున్
బిదన్ నేనిదికొయ్యనావ సతియై ♦ ప్రేమించినన్ సాకలే
నేదో వేడెది పాదముల్ గడిగి ♦ మిక్కిలంతు ని దాచు మ
ర్యాదన్ గూర్చు గుహుండు ధన్యుడిల ♦ రామా! దీనకల్పద్రుమా॥ 75

శా॥ సంసారాంబుధి నెల్లప్రాణుల తరిం ♦ చన్ జేయుగా నావమై
యంసంబిచ్చు జగన్నియంతవట ని ♦ న్నా పిన్నగంగానదిన్
పాంసుల్ దుల్చి తరింపజాలరె వడ్రో ♦ ప్రార్థించె నంటద్దిరే
హంసంబాడగ కాకి నేర్పటిది ♦ రామా! దీనకల్పద్రుమా॥ 76

శా॥ డాయన్ వచ్చు కురంగపోతమును ♦ పట్టన్ గోరు ప్రాణేశ్వరిన్
త్రోయంజాలక సీతగొన్న మిషదై ♦ త్యుద్రించయత్నించినా
వీయౌదార్యము లోకమే మెరుగు నూ ♦ హింపంగ విస్పష్టమా
మాయాశంబర మీవెరుంగవొకొ ♦ రామా! దీనకల్పద్రుమా॥ 77

శా॥ కాకిన్ గోత్రులనెల్లుబంట్లనుశుతన్ ♦ గాపాడి సూడైన పెన్
రాకాసిన్ శబరిన్ గుహున్ జిరకృపన్ ♦ రక్షించి చేపట్టిన
ట్లా కాలంపు భవచ్చరిత్రనుడువన్ ♦ హర్షించి నేడెట్టులో
మాకష్టంబుల దీర్పగామనవి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 78

శా॥ పోసినట్టి సముద్రపై నొక శరం ♦ బున్ దూసి చాపాను సం
ధానం బేర్పడ లక్ష్యశుద్ధిగనుచిన్ ♦ దర్శించి తద్వార్ధిదే
వానన్ బ్రోవుమనాధరక్షణమునీ ♦ భారమ్మె సుమ్మన్న నే
హానిన్ జేయక రక్షించితివి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 79

శా॥ మారీచాదులజంపి భార్గవుని స ♦ న్మార్గంబుళోధింపి దో
స్సారున్ వాలిని నెల్లనంపితి జగ ♦ జ్జంతూత్కరోపద్రవా
కారున్ రావణుప్రాణవాయువుల సా ♦ కల్యంబుగా దెంపిలో
కాధ్యక్షుండవుగా నెసంగితివి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 80

శా॥ భూభారాహరణార్థమై రవికులం ♦ బున్ జొచ్చి భూపుత్రికా
సౌభాగ్యప్రదపాణిపంకజసుఖ ♦ స్పర్శంబు గావించి దు
ర్లోభావిష్కృతదైత్యముష్కరుల సి ♦ ల్లోకంబుగా జేయుచీ
క్షోభ్యద్ధర్మమనన్యసాధ్యము రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 81

శా॥ సేవల్ జేయునటంచునంజనిసుతున్ ♦ జేపట్టి సీతమ్మయే
తోవన్ బోయెనొ గాంచగా ద్యుమణిపు ♦ త్రున్ సాకియున్నావునీ
సేవాధర్మమెఱుంగలేరిజడులన్ ♦ జేకొన్న నిష్కామక
ర్మావిర్భూతయశంబునీకె యగు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 82

మ॥ జనిహేతుత్వము దాల్చు పంక్తిరథ పు ♦ త్రా సత్ఫలంబో వశి
ష్టుని ప్రారంభ గురుత్వశక్తియొ గిరి ♦ ష్ఠుండైగా ధేయుడి
చ్చిన శస్త్రాస్త్రబలంబొ ముక్తులతప ♦ స్సిద్ధార్థమో నిశ్చయ
మ్మనజాలన్ ఫలియించె నెల్లెడల రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 83

మ॥ సరయూతీరమునన్ మనోహరవనీ ♦ చంద్రోపలాధిత్యకాం
తరసంతాన సుమప్రసేకపవనాసం ♦ దంబునన్ భూమిజా
సరసాలాపములాడు వేడ్కవిశిరక్ష ♦ శ్చక్రివక్రాటవీ
మరుభూముల్ దిరుగాడు తేమనుదు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 84

మ॥ పొగడన్ జాలిన యోగులన్ విడచినన్ ♦ పూజించు దేవౌఘమున్
మొగమే జూడక లోకకంటకజగ ♦ న్మార్గామరారాతులన్
రగులన్ జేసి రణోర్వి బోకడచి చే ♦ రన్ దీయుచున్నట్టిది
వ్యగుణాలంకృతి వేమి నీకరుణ రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 85

మ॥ హితులై కొందరు శత్రుభావముననీ ♦ హేతిన్ రణోర్వీస్థలిన్
హతులై కొందరు సర్వయోగిగణ ని ♦ త్యాకాంక్షమాణస్థలీ
స్థితులై వాక్పతిచంద్రశేఖరసునా ♦ సీరాదు లెంతయున్
మతశిద్ధాంతములియ్యజాలుదురు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 86

మ॥ క్రతుభుక్స్రవంతరంగిణీజనకమై ♦ గంగాధరాబ్జాసనా
ర్చితమై దానబలీంద్రశీర్షమణిమై ♦ శ్రీమద్విదేహావనీ
పతిసంత్రాణిత మౌనిపదము మ ♦ త్పాపనోదక్రియా
యతకీర్తిన్ విలసిల్లుగాక ధర రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 87

మ॥ సకలామర్త్యనతంబు నీతిలకమై ♦ పాతోదహల్యాసతీ
ప్రకటాఘౌఘనివృత్తిమార్గమయిదీ ♦ వ్యాద్వ్యాసదూర్వాసయో
గికదంబస్తుతిగోచరంబయిన నీ ♦ క్రీడాపదోద్యద్రజ
స్స్మకమున్ దల్చుత భక్తకోటులకు రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 88

మ॥ సుమనస్సంఘములైన నీదయకునై ♦ జోడించి కేల్దోయిమా
సములున్ వత్సరముల్ మహాయుగములా ♦ శాపాశముల్ ద్రోసి స
ర్వము నీవంచుయజించుచుందురొ భవ ♦ ద్భద్రప్రదంబైనయా
మమకారంబును జూపగామనవి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 89

మ॥ పదముల్ వీడని యంజనీతనయుడుం ♦ బ్రార్థించి ప్రార్థించి బ
లిష్ఠుండై యుండిన యావిభీషణుడు నీ ♦ లీలావతారంబుతో
సహవేశం చేయగలేక నిల్చిరిక నే ♦ నా! నిన్ను సాధింతున
న్నది సందేహము నుయ్యాయెనని రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 96

మ॥ కనులన్ మూసిన విచ్చినన్ సతము నీ ♦ కల్యాణ రూపంబునా
మనమందెంతొ దొలంగకుండునటుల న్ప్రే ♦ మాజూపుమా మాత్రమీ
మనినాశ్లైరయి నరిపగాభవమునందన్ బూని పెన్ భక్తిమై
మనసారన్ నినుగొల్వ నేర్పదను రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 97

మ॥ భయభక్తుల్ చెలువార యీశతకమున్ ♦ వ్రాయించి యర్పించినీ
దయకై కేల్గవమోడ్చి వేడుకొను శ్రీ ♦ భాయుక్తులన్ గోటివీ
రయనున్ గుర్వశు శేషయోగ్ధిధుల నీ ♦ ర్ఘాయుష్యసంతాన స
త్ప్రాగున్ నైభవలీల నేలవా రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 98

శా॥ భక్తిశ్రద్ధలదాల్చి యీశతకమే ♦ భక్తుండు పారాయణా
సక్తిన్ దాపఠియించినన్ కలుషముల్ ♦ శాంతించి సంసార ని
ర్ముక్తుండై వృహిణాద్యసుత్యగణనా ♦ రోహించు మోక్షంబును
వ్యక్తంబై యిటు సేయగామనవి రా ♦ మా! దీనకల్పద్రుమా॥ 99

మ॥ శతపద్యార్చన నొక్కపూసికగ నే ♦ సాగించి చేకూర్చి భూ
పతి మూర్ధన్యుడవైన నీచరణ సే ♦ వాయుక్తి కేంగ్గితిన్
క్షితి సంపద్గృహిణీ సుతాప్తకవితా ♦ సీమంతినీ సంతతా
యతకీర్తిన్ దయచేయగామనవి రా ♦ మా! దీనకల్పద్రుమా॥100

—* శివదర్శన సమయమున చెప్పిన పద్యము *—

శా॥ తీరెన్ బద్ధ శతకకల్పనము ధా ♦ త్రీభృద్ధనుస్తాండవ
ప్రారంభోత్సవ వీక్షణాగత సు ♦ ర్వశ్రేణులన్ రాణులన్
జేరంబోయి నమస్కరించి సుగలా ♦ శీర్వాదమున్ గాంచుమో
శ్రీరమ్యాశుకవిత్వదివ్యగుణనా ♦ సీమంతినీకన్యకా॥

గద్య. ఇది శ్రీమద్గద్వాలాస్థానవిద్వత్కవి
శతావధాని గాడేపల్లి వీర
రాఘవశాస్త్రికృత
దీనకల్పద్రుమ
శతకము
సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



